*

శ్రీ విద్యా వినయమ్ములు
ధీ విభవమ్మును యశమ్ము దిరమై నా యీ
పావన తర కృతి కన్యా
జీవితపతి గూడి శోభ జెన్నొసలారున్.

*

కృతిభర్త:



శ్రీ శ్రీ శ్రీ
వి. వెంకటనారాయణరావు
జమీందారువారు

# రాణీ సౌశీలము

## మొదటి దృశ్యం

[అవ్యక్త మధురగానం చేస్తూ అబ్ధితరంగాలు ఇసుక పానుపుమీద ఒరిగిపోతున్నై. దూరపులోతుల్లోంచి వేయి చేతులూ సాచి ఏడుగుఱ్ఱాల దొర ముసిముసి నవ్వులతో చరచరా సాగివస్తున్నాడు. మాటలతో, పాటలతో, ఆటలతో జంతుసంతాన మంతా కిలకిల్లాడుతోంది. జావా ద్వీప మానాడు అదో విధమైన అనిర్వచనీయానందా న్ననుభవిస్తోంది.

చుక్కల నడుమ చంద్రుడా అన్నట్లు జన సమూహం మధ్య కౌండిన్యుడు దిక్కులు పరికించి చూస్తూ, మెల మెల్లగా రాజప్రాసాదోన్ముఖుడై పయనిస్తున్నాడు.

కవాటాల కిరు పార్శ్వాల్లోనూ నిలబడీ, పంచపాళిలో నుంచునీ, ముగ్ధాంగన లెందరెందరో కులుకు చూపులతో రాచబాట నలంకరిస్తున్నారు. బాలబాలిక లచ్చటచ్చట ఉన్నత ప్రదేశాలల్లో నిలబడి చూస్తూ, చోటు దొరికినప్పుడల్లా తొంగి తొంగి తిలకిస్తూ తమ తమ ఆవేశాన్నీ ఉత్సాహాన్నీ వెలువరుస్తున్నారు.

కౌండిన్యుని చూపులు అనతిదూరంలో ఉన్న రాజ ప్రాసాదం మీదకూ, తరువాత ప్రాసాదోపరిభాగాన నిలబడి తన దిక్కే తిలకిస్తున్న యువతిమీదకూ మళ్లినై.]

కౌండిన్యుడు:—ఎవరది...? ఆ హరిణేక్షణ చికిలి చూపులతో

యెవరికోరకోగదా నిరీక్షిస్తోంది. ఆమె కనుపాప లర్పించే స్వాగతం ఆ ఉదయభానునికా...? లేక నాకా? ... అది రాజప్రసాదం కాదూ? అలానే తలపిస్తోంది. ఐతే... ఆమె...? శాపోపహతయైన యే అప్సరోంగనా కాదు గదా? ఇంతవరకూ నేను విన్న తరంగమాలికల కిల కిలల కర్థం ఆమెను పిలవటమేనేమో? తొలిశకునం మంచిది కావాలని సహస్రకరుడు తనకై కోరి రప్పించు కున్న యే దివిజాంగనా కాదుకదా; ఆ శుభాంగి. (ముందుకు నడిచి చిరునవ్వుతో) తమ్మిదొర కైనా కాక పోయినా నాకుమాత్రి మీ దర్శనం శుభోదయచిహ్నం గానే ఉంది. నే నీ సీమలో బందీనికాక అతిథినై ఉన్నట్లు అనిపిస్తోంది. నాకు సానుభూతి చూపేవారిలోనూ, నన్ను విమర్శించేవారిలోనూ కూడా ... ఈ జనసమూహంలో ... నాయందు వారికి గల అభిమానం నిగూఢంగా ద్యోతమాతూనే వుంది. అదేదో అనిర్వాచనీయానందం నాలో పొంగి, ప్రవహించి, నా హృదయాన్ని సాంతం కదలించేస్తోంది సుమా; ఆ జలజా తేక్షణ. ఐనా......

చెలిమిగాని తోటి కలహించి యిలు వీడి
జలధి యానమునను బలము నోడి
నిలతు నెచట ననుచు తలపోయు నేనేడ?
కలుము లేడ? వలపు తలపు లేడ?

ప్రతీకార వాంఛానిలోద్ధూతావమానద వాగ్ని హృదయ

రా జీ సా హు

కుహరంలో నాల్కలు సాచి విజయవిహారం చేస్తున్న యీ ముహూర్తంలోనా నాకీ ప్రణయభావాలు?

(ఆగి, తిరిగి మందహాసం చేస్తూ) ఏమో...! ఈ నా రాకను దైవం యెందుకుగా నిర్ణయించాడో! ఆవిలాసినీ సందర్శనం నాలో యెట్టి మార్పులు తే సంకల్పించిందో! ఈ ప్రజ లామెను వీక్షించి, అవనతవదనులై, గౌరవ పురస్సరంగా అడుగులు వేయటంచూస్తే ఆ పువ్వుబోడి వీరంద రికీ ప్రభ్వీణియా అనిపిస్తోంది సుమా! ఏమో...! అదే యథార్థమైతే......? ఆ కరుణారసార్ద్రవీక్షణమాలికలు నా యీ గళసీమ నలంకరించటానికి అర్థం యేమై ఉంటుంది? మందగమనాన్ని పొందిన నా యీ పులకిత శరీరం అంతకంత కామెకు చేరువగా జరగటంలో గల అభిప్రాయాన్ని యేమని గ్రహించాలి! ఏ దేమైనా నాలోని ఆనందం సహేతుక మైందే ననటం సత్యదూరమౌతుందా? ...కాదు. కానేరదు కూడా!...ఓహో...! ఏమి ఆనందం!

జలదాశ్వంబులపై వియత్పథమునన్,
సాలంకృతం బైన జా
బిలి స్వారీ యొనరించు మాడ్కి నదె త
త్స్త్రీరత్న మేమొం డా మహో
జ్జ్వల రత్నాంచిత హేమహర్మ్యమున ను
ద్భాసిల్లు; నక్ గావ భూ
స్థలికిన్ డిగ్గిన వేల్పుటింతి యన నా
నల్ గొల్పు చిత్రమ్మహో! (వెడతాడు)

# రెండవ దృశ్యం

[సోమాదేవి పంచపాళిలో నిలబడి వీథిలోని జనసమూహం వంకా, కౌండిన్యుని వంకా, ఆగి, ఆగి, తన చేరువనే ఉన్న వృద్ధపరిచారిక వంకా తిలకిస్తూఉంటుంది. పరిచారిక కూడా ఆ వింత యేమిటో తెలుసుకుందా మన్న ఉత్సాహంతో సోమాదేవి చూపుల ననుసరించవలసిందిగా తన నయనాల కాజ్ఞనిచ్చింది. ఒక క్షణకాలం అలానే జరిగిపోయింది.]

సోమ:— ... శాంతా ... !

శాంత:—అమ్మా ... ఆజ్ఞ ... ?

సోమ:—(వీథివైపు చూపుతూ) ఆఁ......! అటుచూడు. అక్కడ...

శాంత:—(అటేచూస్తూ) అందరూ మన ప్రజలే...!

సోమ:—సరి...! అదికాదు. ఆ దిక్కుగా...మన భటులు... ఎవరోన్ని బంధించి తెస్తున్నారు ... కనబడటం లేదూ !

శాంత:—(నిదానించి చూసి) ఊఁ...! ఔనమ్మా!

సోమ:—(చిరాకుగా) ఔను, కాదు, అన్నది మా కప్రస్తుతం. బ్రహ్మవర్చసు ముఖాన తాండవ మాడుతుంటే...అదేదో వింతగా ... భూమ్యాకాశాల రెంటినీ కలపటానికా అన్నట్లు చూస్తూ, కాశ్యపి కదలిపోతోందా అనిపించే టట్టుగా అడుగులు వేసుకుంటూ వచ్చే ఆ...నవమన్మథా కారుడు ... (నాలిక కరచుకుని) అదే...ఆయువకుడు...? (ఏదో ఆలోచిస్తూ మాటలు మింగేస్తుంది.)

శాంత:—(ఏదో ఊహించుకున్నట్లుగా చిలిపిగా చూస్తూ)

అమ్మా ... యువకుడు కదూ! ఔను ...! ఐనా...
(క్రిందకు పోతుంది.)

సోమ:—(అక్కడే పచార్లు చేస్తూ) ఊహుఁ...! ఏ ప్రాంతీయుడో! గమ్యస్థాన మేదో...! ఎందుకొఅక్కై యిటుగా వచ్చాడో! ఆ చూపుల్లో యెంతటి తీక్ష్ణత వుంది! ఆ ముఖంలో యెంతటి విద్వత్ప్రభ గోచరిస్తోంది! ఆ నడకలో యెంతటి రాచరికపు టొద్దిక ద్యోతకమౌతోంది! (పెద్దగా నవ్వుతుంది) ...ఐనా...నాలో జనించిన యీ ఉత్సాహానికీ, ఉద్రేకానికీ కారణంయేమిటో కదా! ఎందరుబందీలుగా నా సమక్షాన నిలబడటం లేదు...! ఎందరు నా దయా రసామృతాస్వాదన చేసి స్వేచ్ఛావాయువులు పీల్చి సుఖించడంలేదు! కాని, అతనిని వీక్షించినదాది నన్ను నేనే విస్మరించినట్లౌతోందే! నా నిరంకుశ రాజ్యాధికారం అతని పాదసరోజాల ముంగిల ప్రణమిల్ల నుంకిస్తోందే!...... ఏమి చెప్పుమా! అతనిలో గల ఆకర్షణ శక్తి! ఊహుఁ...! ఎందుకోగదా...

తమ్మి చేడియ దినమణి దర్శనమున
నోడలు తెలియని మోదముం బడయు మాడ్కి-
నతని గాంచిన నా హృదయమ్మునందు
చిలిపి పలుకుల గులుకు రాచిలుకగములు.

శాంత:—(ఆతురతతో ప్రవేశించి) అమ్మా...!

సోమ:—(ఆశ్చర్యంతో) ఏమే...?

శాంత:—(వచ్చే నవ్వును లోపలనే అణచుకుంటూ) అమ్మా ... ఏమీ లేదు. అతడొక వెఱ్ఱివాడుట. సముద్రతీరాన స్పృహ తప్పి పడివున్న అతణ్ణి మన భటులు కనిపెట్టి, సేదతీర్చి ఎన్ని ప్రశ్నలువేసినా అతడు సమాధానం యియ్యకపోవటంచేత అనుమానించి, బంధించి... కచేరీలో నిలపెట్టడానికై...

(సోమ ఆశ్చర్యంగా వింటూ, లోపలికి చూస్తూఉంది. ఓ భటుడు వచ్చి నమస్కరించి నిలబడతాడు)

భటుడు:—మహారాణి వారి అనుగ్రహం.

సోమ:—వారి కిక్కడకే దారి చూపవలసిందిగా మా అనుజ్ఞ ఐంది.

భటు:—చిత్తం... (వెడతాడు)

శాంత:—(జంకుతూ)...అమ్మా......!

సోమ:—ఏమే...?

శాంత:—తమ...ఆజ్ఞ...

సోమ:—ఊం...! ఆజ్ఞ...?

శాంత:—మనస్ఫూర్తిగా...

సోమ:—శాంతా...! నీకు వృద్ధాప్యం ముదిరినకొద్దీ బుద్ధి మాంద్యం దట్టమౌతోందే! నా గొంతులో యెన్నడైనా అపస్వరంగాని; భిన్నధ్వనులుగాని విన్నావా...?

శాంత:—క్షమించాలి. నా అభిప్రాయం...

సోమ:—ఊం...! అభిప్రాయం...?

శాంత:—పర దేశస్థునికి ప్రథమంలోనే ... అంతఃపుర ప్రవేశం...

సోమ:—(నవ్వి) ...పిచ్చిదానా...పర దేశస్థుడైతే మాత్రం పవిత్రమనస్కుడు కారాదా...?

శాంత:—కాదు తల్లీ! అతని గుణగతాలు...

సోమ:—తెలియకముందే యిలా రానీయటం ముప్పు తెస్తుందని...! అంతేనా?

శాంత:—(భయపడుతూ) తమ గౌరవానికి...

సోమ:—ఏముంది...? మెరుగు పెట్టడమే ఔతుంది...! సరే... ఆ తెర నిలా లాగి అటువంక ఓ ఆసనాన్ని అమర్చు.

శాంత:—ఆజ్ఞ...! (ప్రక్కగా తొలుగుతుంది)

సోమ:—పిచ్చి అభిప్రాయాలు. అతడ్ని పరికించి చూసి అతడి గుండెనే గ్రహించలేని అమాయకురాలా యీ మహారాణి! పరిచారికాగణం నన్నలాగేగదా అర్థం చేసుకుంది! ఉహుఁ...!

(ఇద్దరు భటులు కౌండిన్యుడ్ని ప్రవేశింప చేస్తారు. దాసి వెళ్ళి అతని వంక యెగా దిగా చూసి, గౌరవపురస్సరంగా ఆహ్వానించి ఆసనం చూపిస్తుంది; 'దయచెయ్యండి' అని. అదంతా సంజ్ఞాబద్ధమైందే కాబట్టి అతని కంతగా బాధ లేదేమో... ఆసీనుడైనాడు. ఆ తెర కావలిప్రక్కన ఎవరో ఉన్నారని గ్రహించాడు. స్త్రీయై ఉండాలని నిశ్చయించుకున్నట్లుగా... సవినయంగా కూర్చున్నాడు.

సోమ ముఖం కళాన్వితమైంది. తన రాణీత్వానికి లోటులేని దర్జాతో మాట్లాడసాగింది.)

సోమ:—శాంతా...! వారి దేశ మేదో అడిగి చూడు!

శాంత:—(అతడి దిక్కై, ఆ ద్వీపపు మాతృ భాషలో) అయ్యా!

(కౌండిన్యుడు నలుదిక్కులా చూశాడు. ఆ ప్రశ్న కర్థం యేమిటో తెలియకా, తనెలా సమాధాన మియ్యాలో తోచకా, లేచి కూర్చున్నాడు)

శాంత—:...అమ్మా ... !

సోమ:—(ఆలోచిస్తూ) ... మఱొక భాషలో ...!

శాంత:—(తన మాతృభాషలో) ఆర్యా...తమ వాసస్థానం...?

(కౌండిన్యుడు సమాధానం చెప్పడు; కాని, ఏమో మెల్లగా సంస్కృతంలో ఉచ్చరిస్తాడు. దాసి అది వింటుంది.)

శాం:—అమ్మా...! తమ రప్పుడప్పుడు...ఒంటరిగా కూర్చుని చదువుతూ ఉంటారే ... అలా...

[రాణి ముఖంలో ఓ మెఱుపు తళుక్కుమంది. లేత చుబుకం మందహాసం చేసింది. ఏదో స్ఫురణకు వచ్చినట్లుగా తల పంకించింది. స్వయంగా కౌండిన్యుని పృచ్ఛిస్తూ సంస్కృతంలోనే మాట్లాడ సాగింది.]

సోమ:—...స్వామీ...!

కౌండి:—(ముఖంమెత్తి చూశాడు. అతని ముఖాన వెన్నెల విరిసింది) ... ఏమి చిరంజీవీ !

సోమ:—తమ నామధేయ మేమో సెలవిస్తారా !

కౌండి:—అందరూ కౌండిన్యుడంటారు.

సోమ:—తమ జన్మస్థలం...?

కౌండి:—ఆంధ్రదేశం.

సోమ:—(ఆశ్చర్యంతోనూ, ఆనందాతిశయంతోనూ) ... ఆంధ్రదేశమా ! ఐతే...తమరిలా దయచేయుటం... ?

కౌండి:—...దైవనిర్ణయం.

సోమ:—...అభిప్రాయం...?

కొండి:—(నిట్టూర్చాడు. అసలే బడలిఉన్నాడో యేమో పూర్వస్మృతీ మనోభీష్టమూ స్ఫురణకు వచ్చి అలసట కూర్చినై. రాణి అది గ్రహించింది) నన్నిలా ప్రశ్నించే దెవరో తెలుసుకోవచ్చా...!

సోమ:—(చిరునవ్వుతో) ఆంధ్రాభిమానం గల జావా మహారాణి.

కొండి:—(చకితుడై) సౌభాగ్యవతీ! క్షంతవ్యుడ్ని. ఈదీనుడ్ని పరామర్శించే దెవరో గ్రహిద్దామన్న కుతూహలమే గాని తమ్మిలా ప్రాధేయపడటంలో మరో అభిప్రాయం లేదు. ఐనా, నా చరిత్ర తమ కే మాత్రం సంతోషాన్ని కలుగ జేస్తుందా అన్నది సందేహాస్పదమైన విషయం. అందులోనూ చెప్పరానిదీ, చెప్పక తప్పనిదీ నాయీ స్థితి. ప్రకృతానికి నా రాక అచింత్యమనీ, ఆశయం ప్రతిజ్ఞాపాలనమనీ మనవి చేసుకుంటే తమకు బోధపడుతుం దనుకుంటాను.

సోమ:—(నొచ్చుకుని)...స్వామీ!

కొండి:—ఏమి ఆజ్ఞ మహారాణీ...!

సోమ:—తమ హృదయం కొద్దిగా నాకు గోచరమైంది. ఇంత వరకూ మిమ్మి బాధించినందుకు మా భటులను క్షమించాల్సిందని ప్రార్థిస్తున్నాను. నిజానికి మీదర్శనం వల్ల నాజన్మ ధన్యత జెందింది. బాల్యంలోనే నాకు ఆంధ్రదేశమన్నా ఆంధ్రప్రజ అన్నా భక్తి గౌరవాలు కుదిరినై. ఉన్నతశిఖరాలతోనూ పుణ్యనదులతోనూ దివ్యోద్యానాల

తోనూ అలంకృతమై ఉండే ఆస్థలాన్ని యెప్పుడు దర్శిస్తానా అనీ, తరిస్తానా అనీ ఆతురత ఉండేది. నా కిలా అనుకోని విధంగా తమరు దర్శనం ప్రసాదించినందుకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

కౌండి:—మహారాణివారి ఆదరణ మిక్కిలిగా ఆనందాన్ని కలిగించింది.

సోమ:—...శాంతా...!

శాంత:—అమ్మా...ఆజ్ఞ...?

సోమ:—వీరికి మా పురోద్యానంలోని సౌధంలో వసతి చూపించి అది మా కోరికగా మహామంత్రులకు తెలియు చెయ్యాలి.

శాంత:—సంతోషం...!

సోమ:—ఆర్యా! ...తమరీనాటికి విశ్రాంతి తీసుకోవటం మా అభిమతం. తిరిగి సంధ్యాసమయాన తమ దర్శనం చేసు కుంటాం.

కౌండి:—తమ వాత్సల్యామృతం యీ కౌండిన్యునికి పునర్జన్మ కల్పించింది మహారాణీ!

సోమ:—(చిరునవ్వుతో) ...సెలవా...!

కౌండి:—యేమని దీవించాలో తోచక గొంతు గద్గదిక పొందింది సౌభాగ్యవతీ...!

[సోమ ఆ తుదిమాట విని లజ్జతోనూ గర్వంతోను తల వాల్చు కుంది. తన ఆనందాన్నంతనీ కనుపాపల్లో దాచుకుంది.

కౌండిన్యుడు లేచి కృతజ్ఞతాసూచకంగా తలవాల్చి, దాసి దారి తీస్తుండగా అనుసరించాడు.]

# మూడవ దృశ్యం

[మబ్బు తెర చీల్చుకుని కలువల రేడు పరుగు పరుగున వచ్చి. తన్ను కోరే తారా వధూటిని పలికించాడు.

కొండలన్నీ దాటి పరవళ్ళు త్రొక్కుతూ ఓ సెలయేటిదొర తనకై ప్రేమగీతాలాపన చేసే ఓ నదీసుందరిని చేరబోతూ ఉద్రేకాన్ని ఉపశమింప చేసుకుంటున్నాడు.

ఒకే ప్రాసాదంలో చెరొక పంజరంలోనూ బంధింపబడ్డ రా చిలుకలు రెండు తమ ప్రణయజీవితాన్ని తలపోసుకుంటూ, భావి శుభాన్ని ఆశించి కిలకిల లాడుతున్నై.]

# నాల్గవ దృశ్యం

[ఉద్యానవన ప్రదేశంలో ఓ మూలచెట్టు మొదట్లో కూర్చున్నాడు, కౌండిన్యుడు. ఏదో యేకాగ్రతతో చింతిస్తున్నాడు. అది గోవులన్నీ యిళ్లకు చేరే వేళ.

చేత్తో ఓ లతను పట్టుకున్నాడు. వెనుకనుంచి రాణి వచ్చి, అతడ్ని చూచి ఆ చెట్టు వెనుకభాగాన సద్దుచెడకుండా నిలబడి ఉంది, అత పది గ్రహించడు.]

కౌండి:—ప్రకృతి చిత్రం యెంత వింతగా ఉంటుంది...!

(ఓ పురుగుపట్టిన భాగాన్నిచూస్తూ) ఉహుఁ! చెట్టి ఆకులకూ, తీవలకూ కూడా యింతటి జ్ఞానాన్ని ప్రసాదించిన దైవం మానవజాతి నింతటి మూర్ఖులుగా చిత్రించటంలోగల భావం అనూహ్యంగా ఉందే...!

ఆర్యధర్మ ప్రసూన సింహాసనమున
చెలగు రాట్పుతుడేడ! నాస్తికునివోలె
బౌద్ధధర్మావలంబియై వరలుటేడ!
ఔర! యిదియెల్ల కలిమాయ యగానుగాదె?

ఉహుఁ...! ఈ లత లెంత గాఢంగా కౌగిలించుకున్నై. ఈవంక పురుగుపట్టి చేతతనాన్నంతనీ పీల్చుకు తింటోందని గ్రహించి తదితరలతలతో......దూర దూరంగా ప్రాకుతూ మరో లతావృక్షాన్ని తోడుచేసుకుని యెంత హాయిగా సాగుతున్నై...! ఇటువంటి విజ్ఞానం మానవులలో లేకపోవటం...

(అసులను మెల మెల్ల తడుముతూ ఆ తీగ నక్కడే వదుల్తాడు. చేరువలో ఉన్న మరోవృక్షంపై పు చూపునిలిపి ...లేచి...వెళ్ళబోతాడు. అక్కడ ఆ చెట్టును పెనవేసుకుని ఓ లత పైకి ప్రాకుతోంది. సాశ్చర్యంగా అటే చూస్తాడు.

చాటున ఉన్న రాణి అతని చేరువగా నిలబడి అతని చర్య తిలకిద్దామనీ, పలుకులు విందామనీ కదలబోతుంది. దాంతో పదచలన శబ్దమూ, కంకణనిక్వణమూ అతడ్ని చకితుడ్ని చేసినై.

వెనక్కు తిరిగి మందస్మిత వదనంతో కౌండిన్యుడు వందన మాచరింపబోయే సమయంలో రాణి అభివాదన మాచరిస్తుంది; ఆర్యధర్మ ప్రకారం. దానిని కౌండిన్యుడు స్వీకరిస్తాడు.)

రాణి:—ఆర్యా లేదో ఆలోచనానిమగ్నులై ఉన్నారు......!

కౌండి:—చిత్రం...! ప్రకృతి చిత్రాన్ని పరిశీలిస్తున్నాను.

రాణి:—ఈ...జడురాలికి......

కౌండి:—మహారాజ్ఞీ...! ప్రకృతి వైచిత్ర్యాన్ని గ్రహించటం మహామహులకే కష్టతర మనిపిస్తుంది.

(తా నింతవరకు చూడ నుంకించిన వృక్షాన్ని చూపుతూ) తిలకించారా...! ఈ వృక్షజాతి వేరు... స్థితి వేరు. అదుగో ఆ క్షుద్రలత యెక్కడ పుట్టిందో...యెలా పెరిగిందో చూశారా...ఆ భిన్నస్వరూపాల పరస్పరాకర్షణ......! అనేక విధాలుగా అల్లుకు పోయినై; ఆ రెండూను. ఊహుఁ...! ఇది ప్రకృతిచిత్రానికి చిన్ని ఉదాహరణ కదూ...! అందుకనే పరిశీలిస్తున్నాను. (చిరునవ్వుతో) మహారాణి వారి కిది బోధపడిందనే తలుస్తాను.

[ఇది చెబుతున్నంత సేపూ రాణి మనోభావాలు తూగులాడి పోయినై. అతని మాటల్లో...యేదో అంతరార్థం ఆమెకు స్ఫురించిందని సూచనగా ఆమెలోని ముసిమూసినవ్వే చెప్పినై.]

రాణి:—చిత్రం. తమ బోధనక్రమపరిభావం అటువంటిది.

కౌండి:—(నిదానించి)...రాణి వారేదో...

రాణి:—...ఏముంది...? తమరు సెలవిచ్చినదంతా స్ఫురణకు తెచ్చుకుంటున్నాను.

కౌండి:—ఊహుఁ...! ఏమంత మహావిచిత్రమైన విషయాన్ని మనవి చేసుకున్నానని...?

రాణి:—...ఆర్యుల కది స్వల్పమే కావచ్చు.

కౌండి:—(సవినయంగా) నాపై రాణీవారికి గల అభిమానానికి తార్కాణ మిది.

రాణి:—(మాట మార్చటానికి యత్నిస్తూ) స్వామీ...! తమ పూర్వజీవితవిశేషాలేమైనా సెలవిస్తారేమో నన్న కుతూహలం......

కౌండి:—మీ ఆజ్ఞ......!

(కౌండిన్యుడూ చేరువనే ఉన్న పూలచెట్ల మధ్య నిర్మింపబడ్డ పాలరాతిన్నె వద్దకు నడుస్తాడు; మౌనంతో. మంత్రముగ్ధ మాదిరి రాణి అనుసరిస్తుంది. ఎదురెదురుగా అమర్చబడ్డ ఒకదానిమీద రాణి కూర్చుని అప్పుడే ఓరగా చూస్తున్న అతనికి సైగద్వారా రెండవదానిమీద కూర్చోమని తెలుపుతుంది. అతడూ బహుశ్రద్ధతో ఆ ఆజ్ఞ శిరసావహిస్తాడు.

రాణి ఒక్కమారు నలుదంకలా చూసి, కౌండిన్యుని పైకి దృష్టి సారించింది. విద్యుల్లతకు భ్రమసినట్లుగా అతడు చూస్తాడు.)

రాణి:—...ఆర్యా...నిరీక్షిస్తున్నాను.

కౌండి:—(పరధ్యానంలో) .... దేనికోరకో...!

రాణి:—(అవనత వదనయై) ...తమ పలుకుల...

(రాణి ముఖంలో మరో చెప్పలేని కాంతి విరిసి కనురెప్పల్లో దాక్కుంది. అర్థం తెలియని ఆవేశంతో నిట్టూర్చింది. ఆమె హృదయం పొంగులువారిం దని ఆమె చూపిన లజ్జాభినయమే సూచించింది. అదే నిత్యమై తెలయాలని దేవతలు చల్లిన అక్షతల మాదిరి... ఆ వంగిన తలమీద రెండు పూలు రాలినై. కౌండిన్యు డది తిలకించాడు.)

కౌండి:—...రాణివారి కిది శుభోదయ చిహ్నం...!

(రాణి తల కొద్దిగా యెత్తింది. వెంటనే తలమీది పూలు ప్రక్కగా జారినై. అవి చూసి సిగ్గుపడ్డది.)

కౌండి:—మహారాణీ...! తమ ఆజ్ఞ మరచి యింకా ప్రకృతి పరీక్షలోనే ఉన్నాను, క్షమించాలి.

రాణి:—పిన్నల నలా అర్థించటం...!

కౌండి:—(చిరునవ్వుతో) .. ఆంధ్రదేశంలో పుట్టి పెరిగిన ప్రతి జీవీ గుణానికే ప్రాధాన్యము కల్పిస్తుంది, మహారాణీ! అదీకాక, నా నాస్తికత్వం - బౌద్ధమతం ద్వారా - భూమిలో అడుగు పెట్టీపెట్టకమునుపే వదలివచ్చాను కాబట్టి ఈ మాత్రపు జ్ఞానమన్నా నిలిచింది నాలో. ఇంతకూ చెప్ప మరచాను; నేనిలా రావటానికిగలకారణం. ఈ నాటి ఆంధ్రసామ్రాట్టు మాధరీపుత్ర శకసేనుడు. నేనో అతని అమాత్యపుత్రుడ్ని. ఆబాల్యమిత్రుడ్ని. మొన్న మొన్నటి వరకూ ఆ ప్రభువు పాలించే వైదికమతధర్మాన్ని ఈ మధ్యవచ్చిన శకులనే బౌద్ధమతావలంబులు రూపుమాప

సమకట్టారు. నే నతని ఉన్నతి నాశించి, అతని బల హీనతను బైటపెట్టి, ఆ ప్రవర్తన మంచిది కాదని సాహసించి చెప్పాను. అప్పటికే ఆ నాస్తికత్వం కన్నులు కప్పి ఉండటం చేత అత డాగ్రహించాడు. అందుకనే తగిన ప్రతిఫలం అవమానరూపాన నాకు బహూకరించాడు. ఏనాటికైనా అతని దురధికారాన్ని అణచగల శక్తి కలిగితేనే గాని తిరిగి ఆ సీమలో కాలుపెట్ట నని ప్రతినబట్టి నేనూ దేశాటనార్థం బయలుదేరి... ప్రకృత మీా ద్వీపం చేరుకున్నాను. మహారాణివారి మృదుహృదయాని కీ చరిత్ర ...

(రాణి అంతవరకూ ఆశ్చర్యంతో వింది. అప్పుడప్పు డతని ముఖావలోకనం చేస్తూ అతని ఉద్దేశాన్ని గ్రహించింది. ఈ తుదిమాట విని చకితురాలైంది)

రాణి:—... ఆర్యా ... !

కౌండి:—...మహారాణీవారి ఆజ్ఞ ... !

రాణి:—ఇంతటి ప్రతిభాశాలురు మీారే పొరబడితే...?

(కౌండిన్యు డేమీా పల్కడు.)

రాణి:— (చిరునవ్వుతో)...పైగా ...అసూయాత్మ్యపుత్రులు...!

(కౌండిన్యుడు మందహాసం చేస్తాడు.)

రాణి:—అన్నిటినీ మించి ... ఆంధ్రయోధులు...!

(కౌండిన్యు డోరగా చూసి తలవాల్చుకుంటాడు.)

రాణి:—స్వామీా...! ఆంధ్రవీరుల కథలు వింటేనే ఒడలు జలదరిస్తుందే... స్వయంగా తమ ద్వారా తమ చరిత్ర వినే నా హృదయం ఎలా ఉంటుందో ఊహింపలేరూ...!

(కౌండిన్యుని ముఖసీమను గర్వం తొంగిచూస్తుంది.)

రాణి:—ఆర్యా...!
కౌండి:—మహారాణీ...!
రాణి:—ప్రసంగంలో అడగటం మరచాను. నేడు మీకు సౌకర్యాలన్నీ సమకూరినై అనే తలుస్తాను...।
కౌండి:—శరచ్చంద్రికకు ఉష్ణత నారోపించడం వేమే నిర్భాగ్యుల స్వకపోలకల్పితమో కాని యథార్థమౌతుందా మహారాణీ...! (రాణి ముఖం తేజోవంత మైంది.)
రాణి:—అది కల్పితభావమే నని గ్రహించటమూ, దాన్ని కూడా దూరీకృత మొనర్చే వాతావరణాన్ని కల్పించడమూ కాలమే చెయ్యాలేమో!
కౌండి:—ఔను...! కాని...
రాణి:—(సంకోచిస్తూ)...తమ అభిప్రాయం...?
కౌండి:—కాలమే నిర్ణయిస్తుందని వేచిఉండటం ఆంధ్రుల కలవాటులేని విషయంకదా అని.. !
రాణి:—భావం...?
కౌండి:—వృథగా కాలయాపన చెయ్యటం నిశిత ప్రతిభను మొక్క పోనీయటం కాదా మహారాణీ...!
రాణి:—(నిట్టూర్చి) యథార్థమే...!

(ఆలోచించి) శ్లాఘనీయ మైన తమ అభిప్రాయానికి వీలైనంత త్వరలో దోహదమీయటానికి యీ సోమ ప్రయత్నిస్తుంది.

కౌండి:—రాణివారి కృప ... ! ఇంతకూ యిలా అలసట కూర్చటం...

రాణి:—...ఏమీ లేదు. మహాత్ముల నర్థం చేసుకోవట మెంత దుర్ఘటకార్యమో యిప్పుడు పూర్తిగా గ్రహించ గలిగాను.

కౌండి:—అది తమకు నాపై గల అభిమానం...!

రాణి:—యథార్థవచనాన్ని కూడా అతిశయోక్తిగా పరిగణిస్తున్నారు...!

కౌండి:—(సవినయంగా) తమ్ము తామెరిగిన వారి శిష్యుణ్ణి కావటమే దీనికి మూలం...మహారాణీ...!

(రాణి ముఖ కమలం వికసించింది. అతని హృదయానికి మరీ చేరువగా ఆమె భావాలు గమించినై. రాణి కొద్దిసేపేమో ఆలోచించి...... మౌనంగా...... ఏదో స్ఫురణకు వచ్చినట్లుగా శిరఃకంపం చేసి...... కౌండిన్యుని వంక ఓరగా చూసి...... సెలవు కోరనదాని మాదిరి నిలబడ్డది. అతడూ ఆమె అభిప్రాయాన్ని గ్రహించి, చివాలున లేచి, ఆమెకంటె ముందుగా చేతులు జోడించాలని ప్రయత్నించాడు; కాని, ఆ ముకుళిత కరద్వయాలు రెండూ ఒకేమారు పరామర్శ చేసుకున్నై.)

కౌండి:—...రాణీవారు విశ్రాంతి కోరుతున్నారు......!

(ఒకరి నొకరు చూసుకున్నారు; సిగ్గుతెరలగుండా. ఒకరి చూపు లొకరి గుండెల్లో ప్రవేశించినై.

పందిరిమంచపు దోమతెర మాదిరిగా వెన్నెల నాల్గువైపులా రాణీ కౌండిన్యుల నావరించింది.)

*     *     *

# ఐదవ దృశ్యం

[పిల్ల తెమ్మెర దొరలను పెళ్లిచేసుకుని లేతవెన్నెల పడుచు ఊరేగుతున్నై.

దూరాన ఉన్న సముద్రతరంగాలు ఇసుక తిన్నెలో లీనమై పోతూ అదోవిధమైన మృదుమధురగాన స్రవంతిని సృష్టిస్తున్నై.

అక్కడక్కడ భూరుహ శాఖలనుండి ఆకూ ఆకూ రాచుకుని అన్నినగారాలుగా మ్రోయసాగినై.

ఇండ్లకు వచ్చిన భర్తలకు పుణ్యాంగన లిచ్చే హారతులు ఒక కళ్యాణోత్సవాన్ని తలపించినై.

అక్కడక్కడ పణ్యాంగనల చికిలిచూపులు ప్రేమ గీతాలాపన చేస్తూ రసిక హృదయాల నానందింప చేస్తున్నై.]

# ఆరవ దృశ్యం

[కౌండిన్యుడు పదవీ స్వీకరణంచేసి మాసద్వయ మైంది.

ఓ నాటి రాత్రి సాల్వ భూమున రాణి శయనాగారంలో నిద్దుర పట్టక సోఫాలో కూర్చుని ఉంది. ఆమెలో అంతులేనన్ని భావాలు అలజడి చేస్తున్నై అని ఆమె నడవడి చెప్పక చెబుతోంది.]

రాణి:—ఆంధ్ర యోధుడు...! మహామంత్రి...! ఉహుః...! నా రాజ్యాని కింక భయమనేదే ఉండదు. అతడి పాదముద్ర తొలిసారి ఆ ఇసుకతిన్నెపై కాకుండా నాహృదయ పీఠం మీదనే అంకిత మైందా అనిపిస్తోంది సుమా! అతని తొలి చూపు నా మనోవీధిలో తళుకు లీని నప్పటినుంచీ నన్ను నేనే స్థిమిత పరచుకోలేని భ్రమకు లోనై పోవటం ఉచితంగా ఉందా! (ఏదో ఆలోచిస్తూ...) ఇదంతా మోహ భ్రాంతి కాదు కదా! అదే ఐతే, నన్ను నేనే శిక్షించుకుని రానున్న దుర్యశాన్ని దూరం చేయటం మంచిది....! కాదు...! కాదు...! ఈ సోమ హృదయంలో అట్టి నీచ భావాలకు తావే లేదు. పరమపవిత్రమైన యీ జావా ద్వీపాన్ని అరచేత పెట్టుకుని ఆడించగల మహారాణికి అటువంటి నికృష్టచింతనం యే నాటికీ ప్రాప్తించదు. మహా రాజాధిరాజులే ప్రాధేయపడ్డారు కదా; నా కరగ్రహణానికి! రూపజిత మన్మధులే తహతహలాడుతున్నారుకదా, నా ఆహ్వానానికి! వారిపై లేని అభిమానం ఇతనిపై నిలవటంలోగల అభిప్రాయం అన్యధా ఉండితీరాలి. వారిలో లేని మాహాత్మ్యం వీరిలో మిళితమై ఉండాలి. అదే యీ

సోమకు సన్నిహితత్వాన్ని సమకూరుస్తోంది. అంతే...!

(ఆగి, ఆలోచించి) ప్రథమదర్శనంలోనే సన్నింతగా ఆకర్షించిన ధీరస్వాంతుడు యీ మాసద్వయంలోనే రాష్ట్రప్రజ అభిమానానికి పాత్రుడైనాడనుకుని ఆశ్చర్య పడటం దేనికి? ఎప్పుడో మహారాజవుతాడన్న ఆస్థాన విద్వాంసుల మాటలు యథార్థాలని నేడే ఋజువౌతున్నై కదా! ఎక్కడ విన్నా 'కౌండిన్యులవారికింద మాకు కష్టాలా!' అనేవారే కాని, యీ సోమ మాట తలపెట్టేవా ళ్ళున్నారా! ఇప్పుడే యీ మహాత్ముడు మకుటంలేని మహీపతిలా చరిస్తున్నాడే! ఎంత ముదావహమైన విషయము మది!

(నిట్టూరుస్తుంది. భావి శుభోదయా న్నాసించి కనుపాపలు విహరిస్తై.)

ఊహుఁ...! నా యెదుట చేతులు జోడించుకుని నిలబడ వద్దనీ, భృత్యుని మాదిరి మాట్లాడ వద్దనీ యెన్నిమార్లు చెప్పినా అతడు నా భావాలు గ్రహించినట్లే కనబడడు. ...నిజానికి, అతనిలోఉన్న దివ్యతేజం నన్నుబహుధా ఆవ రిస్తోంది. అతని మనసు అనుభవం వల్ల ముదిరినా ఆకృతిలో లేతతనం నవనవలాడుతూనే ఉంది. యే రాజకీయాంశాలు చర్చించాల్సి వచ్చినా అదో కథమాదిరి వర్ణించి, ఆ కథా పంజరంలో నా హృదయకీరాన్ని ప్రవేశింప చేస్తాడు. అతని పాండిత్య ప్రకర్షకి నా శరీరం పొంగిపోతోంది. ఐనా...అతడెందుకు నన్నిలా బాధిలచేయాలి? ఎందరు

మహా మంత్రులు మా యీ ద్వీపానికి సేవచేసి తరించిన వారు లేరు? ఎందరు యోధాగ్రేసరు లీ సీమకై ఆత్మార్పణ చేసి పేరు గాంచ లేదు? ఎవ్వరికీ యిట్టి గౌరవ మర్యాదలు లభించలేదే!

(ఆలోచిస్తూ దీపం పెద్దది చేస్తుంది. నెమ్మదిగా బీరువా వద్దకువెళ్ళి అందులోంచి ఓ గ్రంథాన్ని తీసి దీపం ప్రక్కగా నిలబడి పేజీలు త్రిప్పుతూ)

ప్రభునితోటి పోరి, పరసీమలం జేరి,
ప్రతిభ జెంది, మంత్రి పదవినంది
వినుతి గాంచినట్టి పృధ్వీ సురాగ్రిణీ
ఇటుల నన్ను కలచె దేలనోయి!

(పుస్తకంలో చూస్తూ నిట్టూర్చి)

శ్లో॥ తవ న జానే హృదయం మమ పునః
కామో దివాపి రాత్రావపి
నిర్ఘృణ తపతి బలీయః త్వయి వృత్త
మనోరథాన్యంగాని.

(చదువుతూ మంచం దగ్గరగా వెళ్ళి ఆ పుస్తకాన్నక్కడ ఉంచి, అపులించి, మంచంమీదకు యెక్కి కూర్చుంటుంది. విచారంతో ఏమో ఆలోచిస్తూ వుంటుంది.)

స్వామీ...

నీ తొలి చూపునన్ గఱగి
నీరయి పోయిన నాదు గుండె నే
రీతి ననుగ్రహించెదవొ! ప్రేముడి
తప్పద సీమ బారగా

జేతువో సామి! ఈ ప్రణయ జీవిత
హర్మ్యమునన్ వసింప నీ
కే తగునోయి! దీనను; గ్రహింప గదోయి
అమాత్య శేఖరా!

...సోమా! కొంతకాలం నువ్వు నీరాణీత్వానికి సెలవు చెప్పి సామాన్య స్త్రీ లా చరించ లేవూ! అప్పుడు గాని నీ మనోభీష్టం సిద్ధించదేమో! నిజానికి కొందరు ప్రతిభా సామాన్యులకు అధికారిణివై ఉండేకన్న ప్రతిభాసమన్వితుడైన ఆ అమాత్యుని అధికారిగా పొంది ఉండటం నీకు గౌరవమేమో ఆలోచించావా...! సహజ స్త్రీ త్వాన్ని చంపుకున్న తర్వాత నీ కీ రాజ్యాధి దేవతా పదవి దేనికో చెప్పు!

పలికెడిదెల్ల శాసనము
భాతి జెలంగు, దృగంచలమ్ములన్
మెలగు నహీన సంపదలు,
మేదిని నీయది, యైన నేమి? నీ
వలచిన వాని బొంద నగు
భాగ్యము నందని చాన వీవు; నీ
కులుకు లి కేల! నీ వలపు
కోర్కులు నేల త్యజింపరాదొకో!

(తల పట్టుకుని యేదో బాధ పడుతుంది. ఓప్రక్కగా ఒరుగుతుంది)

అబ్బ! భావోద్రేకంచేత శిరోబాధ మిక్కుటమవుతోందే! ఏ దైనా...

(సౌధం క్రింద కలకలమూ, గది వాకిట పిలుపూ వినబడితే ఆశ్చర్యంతోనూ, భయంతోనూ, ఏమీ తోచక ఆలోచిస్తూ ఉంటుంది. బయట నుంచి అమ్మా! అమ్మా!, అన్న శబ్దం వినిపిస్తుంది. వెంటనే లేచి తలుపు తీస్తుంది; సోమ. ఎదుట దాసి జేవురించిన ముఖంతో నిలబడుతుంది.)

శాంత:—(ఆతృతతో) అమ్మా! మహామంత్రులు మీ దర్శనార్థం......(కవాటంనైపు చూపుతుంది).

రాణి:—(క్షణకాలం నిదానించి) శాంతా...! లోనికి దారి చూపించు!

(దాసి వెడుతుంది)

ఈ సమయాన వారి రాక అనూహ్యంగా ఉందే! అదీ కాక... ఆ కల్లోలం...?

(దాసీ అమాత్యుడూ ప్రవేశిస్తారు. అమాత్యుని ముఖంలో ఓ విధమైన గాంభీర్యత గోచరిస్తుంది. రాణీని చూసి అభివాదనం చేస్తాడు కౌండిన్యుడు. వేగంగా ఆమె స్వీకరిస్తుంది)

... ఈ ముహూర్తంలో మీ యీ ఆగమనం నాకు దేవీ ప్రసాదం మాదిరి తోచింది; కాని...

(దాసి ప్రక్కగా తొలుగుతుంది.)

అమాత్యులకే యింతటి ఆవేశాన్ని కలిగించిన విషయం యేదో ఉండి తీరాలి.

కౌండి:—ఔను మహారాణీ! అట్టిదే సంభవించింది. సుమత్రా ద్వీపవాసుల యుద్ధనావలు మన తీరాన్ని సమీపింపనున్నై అని చారులవల్ల తెలిసింది. అందుకనే తమ అనుజ్ఞ కోరి యిలా......!

రాణి:—ఓహో! (గంభీరంగా) ఐనా...తమ రా కోతి మూకను అణచటానికి నా అనుజ్ఞకై రావటమా......!

కొండి:—(చిన్నబుచ్చుకుని) క్షమించాలి మహారాణీ! కొద్ది సైన్యం యీ వరకే పంపబడ్డది. కాని...

రాణి:—(సందేహిస్తూ) ...ఆ అనుమానానికి మూలం?

కొండి:—ఏముంది...? ప్రజ అంతా ఆ ఆటలో పాల్గొనటానికే తహ తహ లాడుతున్నారు.

రాణి:—(చిరునవ్వుతో) అనవసర మది. ఐనప్పటికీ వారి నెందుకు కా దనాలి...?

కొండి:—కా దనటం కాదు మహారాణీ! నా మనవి వేరు! ఇప్పటికే చాలముంది...

రాణి:—(భయంతో) ...ఏమైంది...? అంతటి శక్తివంతంగా ఉందా ఆ సైన్యం...?

కొండి:—అందుకనే...తమ సెలవైతే...నేనే వీరందరినీ నడిపిద్దామని...!

రాణి:—(చకితయై)...మీరా...!

కొండి:—ఔను మహారాణీ...!

(రాణి చిన్నబోయి నిలబడుతుంది.)

బొమ్మల పెండ్లిండ్లకూ—డా ఓ విధమైన పెత్తనం అవుసరమేకదా అని!

(రాణి విచారసూచకంగా అవనతవదన ఐంది. అంతలో రణభేరి మోగింది. అది విన్న కొండిన్యుడు వుద్రేకపూరితు డైనాడు. రాణి నీరవ ఐంది)

మహారాణీ! నాధుడులేని కుటుంబంలో సామరస్యం కుదురుతుందా! (ఆగి) ఐనా...తల్లి కష్టపడుతుంటే బిడ్డలు ఊరుకోవటం...? (ఆగుతాడు)

(అమాత్యుని అభిమానానికి రాణి సంతోషించింది. కాని, దాన్ని మిం్రగే విచారం ఆమెను పీడిస్తోంది.)

రాణి:—ఆర్యులతో వాదించే సాహసం కూడానా యీ ప్రాణికి! ఏమైనా...ఆ అభిప్రాయాన్ని అంగీకరించటం మాత్రం అసంభవ మనే యనిపిస్తోంది.

కౌండి:—మహారాణీ ... !

రాణి:—స్వామీ ...!

కౌండి:—అత్యవసర సమయంలో తమరిలా ఆలసింప చెయ్యటం కౌండిన్యుడు సహింప లేకుండా ఉన్నాడు.

రాణి:—(నిట్టూర్చి) నిజంగా తమరు మా అనుజ్ఞ కోరే దయ చేశా రను కుంటున్నా నింతవరకూ.

కౌండి:—ఎప్పటికీ అదే నిశ్చయం మహారాణీ !

రాణి:—ఐతే ... మీ ఖడ్గానికి పని కలగదేమో... !

(కౌండిన్యుడు తలవంచుకున్నాడు)

పైగా అది మా ఆజ్ఞ కూడా ఐతే ...అప్పుడో ...?

కౌండి:—(నిర్విణ్ణుడై) మహారాణీ వారికి నాపై ద్వేషముందని భావమా...!

రాణి:—ద్వేషమే కా నవసరం లేదే...! వాత్సల్యంకూడా కావచ్చు. ఆ సందర్భంలో...?

కౌండి:—రెండువిధాలా కౌండిన్యుడు రణరంగానికిదూకుతాడు. ద్వేషమే అయితే, పదవీ భ్రష్టుడై, ఆంధ్రనిశ్శారోత్సాహాలు తుదిసారి చవిచూపడానికి సామాన్యభటుడై పోరు

సాగిస్తాడు. అదికాదో ... అంతటి వాత్సల్యం చూపే మహారాణికి తన ప్రతిభను తొలిసారి వెల్లడిచేయటానికీ, ఇనుమడించిన వాత్సల్యామృతాస్వాదనార్హత నందటానికీ ప్రయత్నిస్తాడు. ఏ విధంగా చూసినా యీ కౌండిన్యుని అభీష్టం నెరవేరుతుంది.

[రాణి శిరం వాల్చుకుంది. మాట్లాడి ప్రయోజనం లేదనుకుని, కుడ్యాన్ని సమీపించి భావభరం చేత దాని మీద వాలబోతూ]

రాణి:—అమాత్యుల వారికే ఆనిర్ణయాధికారాన్ని వొదులుతున్నాం.

కౌండి:—(సంతోషోద్రేకాలతో) అంతటి అభిమానమా యీ ప్రాణి మీద...!

రాణి:—(ఆనందమూ, విచారమూ మిళితమైన పలుకులతో) ఏది సర్వ శ్రేయమో అది ఆచరించటానికి మా అనుజ్ఞ అయింది.

కౌండి:—(ఉత్సాహంతో)...మహారాణీ... సెలవు...!

(కొద్దిగా అగి వెనుకడుగు వేసుకుంటూ నిష్క్రమిస్తాడు. అతడు కనుచూపు మేర దాటే వరకూ రాణి చూస్తూనే ఉంటుంది. ఆమెలో అంతులేని విచారం గోచరిస్తుంది: అదంతా దిగమ్రింగి, శయ్యను సమీపిస్తూ, ఆలోచనతో కూర్చోబోతూ,)

రాణి:—ఈ సంఘటన నెందుకు కల్పించావు ప్రభూ...! ఈవిషమ పరీక్ష కెందుకు నన్ను గురిచేశావు తండ్రీ!

స్వామీ! వెన్నెల గాడ్పుకే నవయు
నా ప్రాణంపు ప్రాణమ్ము నీ

ప్రేమో ద్యానము నుండి భీకర
రణోత్సవాన్ జేర్చినా వేల? నా
యీ మోహమ్మును కంటగించితివ!
లేదేని వానిపై కోపమా!
యేమో పల్కితి మున్ను; నేడయిన
తండ్రీ! వాని దీవింపుమా!

[అంతలో భానూదయవేళ కావచ్చిందని దివాణంలో నగారా మ్రోసింది.]

# ఏ డ వ దృ శ్యం

[జావాద్వీప మంతా ఉత్సాహోద్రేకాలతో పొంగిపోతూఉంది.

సముద్రం వరుసగా అమర్చబడ్డ యుద్ధనావలతోటీ, నావలమీద సగర్వంగా తలలూపే జాతీయ పతాకాల తోటీ వాటి అండ నిలబడిఉన్న వీరులతోటీ కప్పబడి ఉంది.

అచ్చటి ప్రతి ఇసుకరేణువూకూడా అప్పటి జయజయ ధ్వానాల కుబ్బిపోయి కాబోలు యెగిరెగిరి పడుతోంది.

కాల్బలమూ, అశ్వచయమూ. దంతావళి సమూహమూ ఆ భూప్రదేశాన్నంతా అమర్చబడిఉన్నై.

శుద్ధాంత ముగ్ధాంగనలుకూడా అక్కడక్కడ విల్లమ్ములు దాల్చి సాయుధపాణులై నిలబడి ఉన్నారు.

శాత్రవనేత్రాలకు తమ ద్వీపాన్ని కనబడనీకుండా వీరవనితలు తమ తమఅనుంగు పురుషులకిచ్చే హారతులరూపంగా బహిర్గతమైనపొగ మబ్బుగా మారి ఆ సీమ నంతనీ తన గర్భంలో దాచేసుకుంది.

ఓ మత్తేభంమీద అమర్చబడ్డ ఉక్కుపంజరంలో నిలబడి, నాల్గు వైపులా సాయుధభటులు కరీంద్రాలమీదా ఉన్నతాశ్వాలమీదా నిలబడి కాపలా యిస్తుండగా ప్రధానామాత్యుడు, కౌండిన్యుడు, సైనికుల నుద్బోధిస్తూ ఆనందాన్ని నుమడింప చేస్తూ అంతకంతకు ముందుగా సాగిపోతున్నాడు; సముద్రంవైపు.

అంతలో:—

నావల మధ్య కలకలం ప్రారంభమైంది. ఓ శత్రునావ యెల్లానో తప్పించుకుని వచ్చి సముద్ర తటాన తేలింది. ఒకటితనుక ఒకటిగా మరి కొన్ని అదే ప్రదేశంలో వెంటవెంటనే గోచరమైనై. అప్రమత్తులై ఉన్న యిరువాగులవారూ ఉద్రేకపూరితులై శరవర్షం కురిపిస్తున్నారు. శతసహస్రాధికంగా శత్రునావల్లోంచి యోధులు బాహిరిల్లి యెక్కడి సైన్యాన్నక్కడ 'ఢీ'కొంటున్నారు.

ఒక్కుమ్మడిగా "జై ... శ్రీ శ్రీ శ్రీ కౌండిన్యామాత్య శేఖరునకు జై...!" అన్న శబ్దం అచ్చట ప్రతిధ్వనించింది.

రాజ ప్రాసాదం నుంచి ఓ ఉత్తమాశ్వం బిర బిరా సముద్రం వైపుగా పయనిస్తోంది. శ్వేతవస్త్రాలంకృతమైన ఓ వ్యక్తి పైడి గొడుగు నీడలో ఆ అశ్వాన్ని పరుగులు తీయిస్తున్నట్లుగా మాత్రం తెలుస్తోంది. ఆ అశ్వగమనం మూలాన లేచే ప్రతి రేణువూనూ ఒక్కొక్క అంబుగా ఆవ్యక్తి కురిపిస్తున్నట్లుగా కనిపిస్తోంది. బారులు తీరి ఉన్న రణసీమలో ఆ అశ్వం బహు సులువుగా మార్గాన్ని యేర్పరచుకుని అమాత్యుని మత్తేభాన్ని చేరటమే ఆశయంగా గమిస్తూ...... సఫలీకృతమైంది. అమత్తేభాన్నానుకునే నిలబడ్డది కూడా.

* * *

శత్రునావ నుంచి ఓ శరం రివ్వున వచ్చి అమాత్యుని వామభుజాన్ని దూసుకుని పోయింది. అదే సమయాన ఆ తూణీరాన్ని ప్రయోగించిన వాని శిరం దభీమని నేల కొరిగింది.

అమాత్యుని విల్లు జారబోయింది. అంతలో మరో శరం అతని దక్షిణ హస్తాంగుళిని చెదర చేసింది. వెంటనే శత్రుపక్షంలో మరికొన్ని ప్రాణాలు హాహాకారం చేసినై.

మరుక్షణంలో అమాత్యుని శరీరాన్ని తన వక్షోపీఠం మీద ఆన్చి పడుకోబెట్టుకుని ఆ అశ్వం మీది వ్యక్తి. ప్రక్కనే ఉన్న యోధుని కేదో సైగ చేయటమూ, అతడూ ఆశ్చర్యంతో అదే ఆజ్ఞగా స్వీకరించి అమాత్యుని స్థానాన నిలబడటమూ, ఆ అశ్వం కౌండిన్యునితో సహా గిఱ్ఱున వెనక్కు తిరిగి ప్రాసాదంవైపుగా పరుగుతీయటమూ, సైనికులందరూ ఒక్కుమ్మడి మహారాణీకీ కౌండిన్యునకూ జే జేలు పలకటమూ, శత్రునావలు చెర చెరా కాలికి బుద్ధి చెప్పటమూ జరిగినై.]

* * *

# ఎనిమిదవ దృశ్యం.

[రాణీ శయనాగారంలో ముఖమల్ పరుపుమీద పట్టు తలగడాల నానుకుని అమాత్యుడు - కౌండిన్యుడు - యేకాగ్రతతో యేదో ఆలోచిస్తూ పడుకున్నాడు. అలసిపోయిన అతని శరీరం యెదుటి ప్రపంచాన్ని అర్థం చేసుకునే స్థితిలో లేదు. రాణీ సోమ అతని పాదాల దగ్గర విచార సూచకంగా మోము వాల్చి తదేకదృష్టితో అతని ముఖావలోకనం చేస్తూ ... అప్పుడప్పుడొక కన్నీటిబిందువును రాలుస్తూ... మెల మెల్లగా పాదాలొత్తుతూ కూర్చుంది.)

రాణి:—

కలకలలాడు నెమ్మొగము,
కమ్మని మాటలు, పల్కు ముత్తియ
మ్ములు, చిరునవ్వు సోడుములు,
పొంకపు చైదము, లార్యధర్మపుం
దలపులు రాచవారికిని
దాట నశక్యములైన భావముల్
కలిగిన నా మనోహరుని
కౌగిట దేలని జన్మ ధన్యమే!

[అంతలో అక్కడి రాచిల్క ఒకటి కులుకుతూ "ప్రియా...! ప్రియా...!" అని పిలిచింది. రాణి అది విని సిగ్గిలి, కృతక క్రోధాభినయంచేసి, కొట్టబోయినట్టుగా చెయ్యి ఊపి, బిగ్గరగా "ఛీ!... నోరు మూసుకో" అంది.

తిరిగి ఆచిల్క 'ప్రియా! ప్రియా!' అని రెట్టించింది.

సోమకు ఉడుకుబోతుతనం వచ్చింది. తన వలపు పిట్టలకూడా నవ్వు తెప్పించిందే అన్న లజ్జ మిక్కుటమైంది. అలా అనమని తాను దానికి నేర్పిననాటి మోహ మంతా స్ఫురణకు వచ్చి మోమునంతనీతే గులాబీ

చేసేసింది. వెంటనే గొంతు పెగలని మాటలతో 'క్షమించను సుమా!''
అని తన బలాన్నంతనీ ఉపయోగించి ఉచ్చరించింది.

అప్పుడప్పుడే తెలివి నందుతున్న కౌండిన్యుడా తుది పలుకులు విన్నాడు. తా నింకా సంగర రంగంలోనే ఉన్నట్లూ...ఆ పలుకులు తన వైరివీరుల నుద్దేశించి తన సేనానులు పల్కుతున్నట్లూ భావించాడు. ఉద్రేకంతో ''నిజమే...క్షమించరాదు... ఇంతచులకన చేయటమా!'' అంటూ లేవబోయినాడు.

నిష్కారణంగా అతనికి మెలకువ తెచ్చి అతన్ని ప్రుద్రేకింపజేసి నందుకై బాధపడ్డది సోమ. అతడ్ని లేవకుండా పట్టుకుంది. తిరిగి అతడు ఒరగబోతూ ఉంటే చిలుక ''ప్రియా...! ప్రియా!'' అని అతడి దిక్కు పలికింది. ఇప్పుడు నిజంగానే కోపగించుకుంది సోమ.)

కౌండి:—(తెలిసీ తెలియని స్థితిలోనే) ...ఎవ రా పిలిచేది!

రాణి:—(అమాయకంగా) పడుకోండి...! నేను కాదు...!

[చిలుక తిరిగి 'ప్రియా! ప్రియా!' అంది. కౌండిన్యు డటూ యిటూ తడివి చూశాడు. రాణి చేతులు అతని పాదాల దగ్గరగా ఉన్నట్లు తెలుసుకున్నాడు. మైకపు తెర యింకా అతడ్ని వీడకపోవటం చేత ఏమీ చేయలేక ... అనలేక అలానే ఊరుకున్నాడు. కొద్దికాలం అలామౌనంగానే గడిచింది.]

కౌండి:—...మహారాణీ...!

రాణి:—...స్వామీ...!

కౌండి:—(ఆత్రంతో) ఇక్కడికి...మీరు...ఈ సమయంలో.

(రాణి మాట్లాడక పూర్వమే చిలుక మళ్ళీ 'ప్రియా!' అన్నది.

కౌండి:—మహారాణీ! మీరేనా అలా సంబోధించేది...!

రాణి:—కాదు స్వామీ...!

కౌండి:—...శాత్రివాసీకం యింకా నిర్జింపబడక పోవటం...
కౌండిన్యుడు ఆ చిన్నిదెబ్బకే వెనుకంజ వేయటం ...
అయ్యయ్యో...! (బాధనీ అవమానాన్నీ వెలుబరుస్తాడు.)

రాణి:—స్వామీ...! తమకే జయం సిద్ధించింది. ఇక కొంత సేపట్లో ఆ వార్తకూడా మనం వింటాం. మీరు మాత్రం బాధపడకండి...!

కౌండి:—ఆఁ...! ఆఁ... ! జయమే... !

(స్పృహకలిగిం దతడికి. రాణి పరిచర్య చేస్తోం దన్న విషయం గ్రహిం చాడు. వెంటనే ... నొచ్చుకుంటూ ... లేవ యత్నించాడు.)

రాణి:—(అదిమి పట్టుకుని) లేవకండి ... ! మీకు విశ్రాంతి అవుసరం.

కౌండి:—మహారాణీ...! (ఆమె చేతిని తొలగించ బోతాడు) ఇది...తగని పని. ఎవరన్నాచూస్తే... !

రాణి:—ఫరవా లేదు...పడుకోండి!

కౌండి:—లోకం చేసే విమర్శకు తాళటం...!

రాణి:—మీకు ఉపచారం చేసే భాగ్యాన్ని పొందని ఈర్ష్యాళువులు అలా అనుకున్నా భయం లేదు. ఐనా మీ రెవరో గ్రహించిన వా రెవ రలా అనగలరు...?

కౌండి:—(బాధపడుతూ)...అబ్బా...!

(రాణి కొద్దిగా ముందుకు జరిగి, అతని మీదకు వాలి, అతని చేతిని మృదువుగా నిమురుతుంది. అత డామె కరగ్రహణం చేశాడు. ఆమె ఒడలు పులకరించిం దని ఆ నేత్రాలు చెమ్మగిల్లటమే రుజువు పరచింది. అత డామె

చేతిని గట్టిగా...దగ్గరగా...లాక్కొని, హృదయం మీద అన్చుకున్నాడు. పసినిసుంగు మాదిరిగా అతని మీదకు పక్కగా వాలిపోయింది, ఆమె.)

కౌండి-—(బాధతో)... నేను బ్రతకటం అసంభవమేమో... మహారాణీ...!

రాణి:—ఈ బేలతనం కౌండిన్యుల వారి కెలా కలిగిందా అనిపిస్తోంది స్వామీ...!

(సోమ అతని ముఖాన్ని కప్పిన చిరుచెమ్మట కొంగుతో తుడిచింది. అంతలో ప్రాసాదాని కనతిదూరం నుంచి 'జేజే...' ధ్వానాలు దిశాముఖాలు చీల్చుకుంటూ దరిజేరినై. సోమ అది విన్నది విజయోత్సాహచిహ్నమైన ఆ శబ్ద శ్రవణం ఆమెను ఉన్మత్తురాలిని గా చేసింది. లేవబోయింది, కాని, కౌండిన్యుడు బాధపడటం చూసి అతడ్ని గట్టిగా తన హృదయానికి హత్తుకుని ఉద్రేకంతో మాట్లాడ సాహసించింది.)

రాణి:—...ప్రభూ!

కౌండి:—(ఆశ్చర్యంతో)...మహారాణీ!

రాణి:—ప్రభూ! మీ దర్శనమాత్రం చేతనే లభ్యమైన యీ విజయ కోలాహలం విన్నారా!

కౌండి:—(భావోద్రేకంతో) విజయం సిద్ధించిందా...! ఇది చలోక్తి కాదుకదా!

(దగ్గిరగా కోలాహలం; చిలుక 'ప్రియా!' అని పిలవటం)

కౌండి:—ఆ...సంబోధించే దెవరో...!

రాణి:—(సిగ్గుతో) నా హృదయమే ప్రభూ!

(కౌండిన్యుడు నిమీలిత నేత్రు డౌతాడు.)

తమ అమూల్య దేశసేవాభిరతికి యీ అల్పజ్ఞురాలు ఏమి బహూకరింప గలదో...!

కౌండి:—లోకోత్తరమైన తమ ఆదరాభిమానాలను మించిన వస్తువునకా వెతుకుతున్నారు...?

[తిరిగి విజయధ్వానాలూ దుందుభి మోతలూ వినబడతై.

కౌండిన్యుడు లేవబోతాడు ఆమె అతడ్ని బుజం మీదను అన్చునని పంచపాళి వైపుగా నడుస్తుంది. సేవకురాలు తొందరలో లోనికి వచ్చి చూసి ముసి ముసి నవ్వులతో పక్కకు తప్పుకుంటుంది.

ఎదుటి రాచిల్క కిలకిల్లాడుతూ 'ప్రియా! ప్రియా!' అంటుంది.

అది విన్న కౌండిన్యుడు చిరునవ్వుతో రాణి వంక చూస్తాడు. రాణి మందహాసం చేసి సిగ్గు పడుతుంది.

బయటి జనం 'జై...జై... శ్రీ శ్రీ శ్రీ రాణీ సోమాదేవికీ జై. శ్రీ జావాద్వీపమాతకూ జై...' అని కేకలు వేస్తారు.

అక్కడినుంచే సోమ 'శ్రీ శ్రీ శ్రీ కౌండిన్యామాత్య వీరాగ్రేసరునకూ జై .....! అని పలుకుతుంది. జనం అంతా అదే ఉచ్చరిస్తారు. కౌండిన్యుడు చిరునవ్వుతో ఆ శుభోచ్చారణను స్వీకరిస్తాడు.]

* * *

# తొ మ్మి ద వ దృ శ్యం

[సభామంటపంలో జనం క్రిక్కిరిసి ఉన్నారు. అందరూ ఏమేమో గుసగుసలు పోతున్నారు.

ముందుగా వందిమాగధులు వచ్చి కైవారం సలిపారు. జనమంతా 'కిమ్మ'నకుండా నిలబడ్డారు.

మరుక్షణంలో కౌండిన్యుడు సభావేదిక మీద నిలబడ్డాడు. సభ అంతా జయజయ ధ్వానాలు చేసింది.]

కౌండి:—సోదర వీరులారా! జావాద్వీపవాసులారా! ఈ కౌండిన్యుడు మీ కృపారసామృతాస్వాదన చేసి యీ నాటికి అమాత్యశేఖరు డన్న కీర్తి నార్జించాడు. మాతృ దాస్య విచ్ఛేదన బద్ధ కంకణులైన మీ అండ వసించి... మీ సాహచర్యాన్ని పొంది...యీనాడు దేశ ద్రోహుల నుక్కడంచాడు. ఆంధ్రభూమిలో జన్మించి, ఆంధ్రి సామ్రాట్టుచే బహిష్కృతుడై, అశేషాగరాభిమానాలు చూపిన యీ మీ సీమకు చేయగల రవంత సేవనూ చేసి ధన్యుడైనాడు. అందుకు మీ కిత డెల్లవేళలా కృతజ్ఞుడు.

[రాణి అంతలో ప్రవేశించింది, జనం దారి తీస్తుండగా. ఆమె సరాసరి గద్దె మీదకు వెళ్లి ఆగుతుంది. గంభీరంగా నలువంకలా తిలకిస్తుంది.

సభాస్తారులెల్లరూ 'జే జే'లు పలుకుతారు. ఆమె స్వీకరిస్తుంది; సగర్వంగా.]

రాణి:— జావాద్వీపవాస్తవ్యులారా! మీ రందరూ యింత వరకూ విన్నది చాలా మోసంతో కూడిన విషయం.

(జనం తబ్బిబ్బౌతారు, కౌండిన్యుడు ఖిన్నుడౌతాడు.)

మోసానికీ, చౌర్యానికీ యీ సీమలో శిక్ష యేమిటో మీ అందరికీ తెలుసు.

(జను లందరూ ఒక్కసారిగా బలం తెచ్చుకుని 'శిరచ్ఛేదం, శిర చ్ఛేదం' అని కేక లేస్తారు.)

అందులోనూ రాజప్రాసాదంలో జరిగిందానికి...?

(జనులు గంభీరంగా 'ఖండ ఖండాలుగా ఆ ద్రోహిని నరకటమే' నని అరుస్తారు.)

అదీకాక ప్రాణాపహరణానికి మన న్యాయశాస్త్రంలో దండన...?

(అందరూ 'అగ్నిలో నిలువునా ఆ హంతకుని వేల్చటమే' అంటారు)

ఆత్మ ప్రాణి కన్నా విలువ గలది, ఔనా...?

('కాదన్నవాడ్ని ఖండించటమే' అన్న శబ్దం.)

(కౌండిన్యుని వంక చూపుతూ) ఈ మహనీయుడు ... మన ద్వీపంలో చేరిన నాడే...అట్టి కార్యానికి పాల్పడ్డాడు.

(జను లందరూ భయవిహ్వలచిత్తులై ఉంటారు, మౌనంగా. కౌండి న్యుడు తలవాల్చుకునే ఉంటాడు )

'నేడే అమాత్య శేఖరు డన్న బిరుదు నార్జించుకున్నా' నన్న వీరి పలుకులు విశ్వసించటం మిమ్మి మీరు గ్రహించ లేకపోవటం. ఆ అమాత్యపదవి వీరిని మరికొన్ని ఘడియల్లో వీడి పో బోతోంది. అది కూడా వారుచెప్పినట్లైతే మేమెంతో సంతోషించేవారం. ఇక...ఇంతవరకూ మన ధర్మశాస్త్రాల్లో హింస దండనాయుధంగా ఉంది. ఈ నా డది అహింసకు తావొసగి సెలవు తీసుకుంటుంది.

['మహారాణి వారి చిత్తం' అని ఏకకంఠంగా అందరూ ఉచ్చరిస్తారు]

ఈ మహాత్ముడు కోరి హరించినదాన్ని తిరిగి మనం తీసుకో యత్నించడం మనకు మూర్ఖతనూ, నీచత్వాన్నీ ఆరోపి

స్తుంది. అదికూడా హింసాక్రియగానే పరిగణింపబడుతుంది.

[ప్రజలు మౌనంగా ఉంటారు.]

కాబట్టి మనమే మనఃపూర్వకంగా వారికి దాన్ని అర్పింప దలచాం.

['మా తల్లి అభీష్టమే మా ప్రాణం,' అన్న శబ్దం సభ నంతనీ మారుమోగిస్తుంది.]

రేపటి విజయోత్సవ సమయంలో ఆ కానికను పీఠి కీయదలచింది యీ ద్వీపం.

['సంతోషం, సంతోషం' అని కేకలు,]

దాంతో యీ సోమాదేవీ, ఆమె అనుచరులూ అందరూ మన మాతృభూమితో సహా వీరి అధీన మవుతారు.

[ప్రజలు తెల్లపోయి చూస్తారు. కౌండిన్యుని ముఖాన అమితమైన ఆశ్చర్యం గోచరించింది. ఏదో చెప్పబోతాడు, కాని, పక్కనే ఉన్న శాంత - దాసి - వారిస్తుంది.]

శాంత:—స్వయంవరం మన యీ ద్వీపంలో ఆర్యసమ్మతం. మంటపంలోకి రాకుండానే ఉండాలి కాని, వచ్చి, కన్య వరించిన తరువాత నిరాకరించటం గౌరవానికి కళంకం. అది మీ అందరి పక్షానా రాణీవారి అనుమతిని...వృద్ధురాలిని కావటమే నా అర్హతగా గణించి...యీ కౌండిన్యులవారి స్మరణకు తే దలచాను.

(రాణీ కౌండిన్యులొకరి నొకరు చూచుకుని మందహాసం చేస్తారు.

ఆసభ అంతా జేజే ధ్వనాలతో దద్దరిల్లిపోతుంది. సహర్షంగా రాణి ముందుకు నడుస్తుంటే, సగర్వంగా కౌండిన్యుడు అనుసరిస్తాడు.)

# పదియవ దృశ్యం

[సోమా కౌండిన్యుల వివాహం జరిగి మూడేండ్లయింది. వారి ప్రణయ జీవితఫలం ఒక రెండేండ్ల బాలుడు.

ఆనాడు జావాద్వీపంలో బాలరాజు జన్మదినోత్సవం అఖండ వైభవోపేతంగా జరుగుతోంది. ఓ బంగరు గద్దెమీద నిలబడి సోమా కౌండిన్యులు ఆగంతుకులకు లెక్కలేని కానుకలు అర్పిస్తున్నారు.

అంతలో ఓ రాయబారి ద్వారా మాఠరీపుత్రుని వద్దనుంచి ఓ లేఖ లోనికి వచ్చింది. కుశలప్రశ్నలైన తర్వాత ఆ రాయబారి రాజానుమతి నంది యిలా చదివాడు.)

స్వాగతమోయి బ్రహ్మకుల వార్నిధి
శీతమయూఖ! గోమ్ముఖ, సు
స్వాగత, మార్యధర్మ సుమభాసిత
దివ్యవనాంతరస్థితా!
స్వాగత మోయి! వైరిజన సంహరణో
ద్యమబద్ధకంకణా!
స్వాగతమయ్య దీనజన బాంధవ!
స్వాగత మాంధ్రభూధనా!

యిట్లు,

మీ పాదరేణువు,

మాఠరీపుత్ర శకసేనుడు.

(సోమా కౌండిన్యులు హర్ష పులకిత శరీరులైనారు. ఆ నాటి కావ్యాలు శతాధిక మైనై. అనుకున్న ధరణికోట యుద్ధం ఆగిపోయింది. ఆంధ్రదేశ యాత్రికుగాను ముహూర్త నిశ్చయం చేయటానికై పండితుల సమావేశం జరిగింది. ఆ నాటినుంచే కౌండిన్యుడు ఆంధ్రసామ్రాట్టుగా వ్యవహరింప బడ్డాడు.)

*